# అథత్రింశో% ధ్యాయః

## దక్షుని సృష్టి

సూత ఉవాచ|

సంసృష్టాసు ప్రజాస్వేవం అపవో%థ ప్రజాపతిః| లేభేవై పురుషః పత్నీం శతరూపామయోనిజామ్||1

ఆపవస్య మహిమ్నాతు దివమావృత్య తిష్ఠతః | ధర్మేణైవ మహాత్మా స శత రూపాస్యజాయత||2

సాతు వర్షశతం తప్త్వా తపః పరమదుశ్చరమ్ | భర్తారం దీప్తతపసం పురుషం ప్రత్యపద్యత||3

సవై స్వావయంభువో జజ్ఞే పురుషో మునురుచ్యతే |
తస్మై#్యకసప్తతియుగం మన్వంతరమిహోచ్యతే||4

వైరాజాత్పురుషాద్వీరా శతరూపా వ్యజాయత| ప్రియవ్రతోత్తానపాదౌ వీరకార్యావజాయతామ్|| 5

కామ్యా నామ మహాభాగా కర్దమస్య ప్రజాపతేః | కామ్యాపుత్రాస్తు యస్త్వాసన్ సమ్రాట్ సాక్షిరవిట్ ప్రభుః||6

ఉత్తానపాదో%జనయత్పుత్రాన్ శక్రసమాన్ ప్రభుః| ధ్రువం చ తనయం

దివ్యమాత్మానందసువర్చసమ్||7

ధర్మస్య కన్యా సుశ్రోణీ సునీతిర్నామ విశ్రుతా | ఉత్పన్నా చాపి ధర్మేణ ధ్రువస్య జననీ తథా||8

ధ్రువో వర్షసహస్రాణి త్రీణి దివ్యాని కాననే | తపస్తేపే స బాలస్తు ప్రార్థయన్

స్థానమవ్యయమ్ ||9

తస్మై#ె బ్రహ్మ దదౌ ప్రీతః స్థానమాత్మసమం ప్రభుః| అచలం చైవ పురత్స్సప్తర్షీణాం ప్రజాపతిః||10

సూతుడు ఇట్లు పలికెను-

ప్రజలు ఈ విధముగా సృష్టించబడిన తరువాత చేతనస్వరూపుడగు ఆపవ ప్రజాపతి అయోనిజయగు శతరూపను భార్యగా పొందెను(1). మహాత్ముడగు ఆపవప్రజాపతి తన మహిమచే ద్యులోకమును వ్యాపించి యున్నవాడై తానే చేతన ధర్మముగల శతరూపగా అయినాడు (2). ఆమె వంద సంవత్సరములు మిక్కిలి కఠినమైన తస్సును చేసి తపస్సుచే ప్రకాశించే పురుషుని భర్తగా పొందెను(3). ఆ పురుషుడే స్వాయంభువ మనువు రూపములో జన్మించెను. ఆమనువు లోకములను డెబ్బది ఒక్క యుగముల కాలము పాలించెను. ఆ కాలమునకు మన్వంతరమని పేరు(4). విద్వాంసురాలగు శతరూపకు స్వాయంభువ మనువువలన వీరపురుషులగు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు కలిగిరి(5). మహానుభావురాలు అగు కామ్య కర్దమప్రజాపతికి భార్య ఆయెను. కామ్యకు సమ్రాట్ , సాక్షి, ఆవిట్, ప్రభుడు అనే ముగ్గురు కుమారులు కలిగిరి(6). ఉత్తానపాదమహా రాజు ఇంద్రునితో సమానమైన పుత్రులను కనెను. ఆత్మానందముతో మరియు తేజస్సుతో ప్రకాశించె ధ్రువుడు కూడ ఆయన పుత్రుడే(7). ధర్మప్రజాపతికి సుందరీ, ధర్మాత్మురాలు, సునీతి అని ప్రఖ్యాతిని గాంచినది అగు కుమార్తె కలిగెను. ఆమెయే ధ్రువుని తల్లి(8). ఆ ధ్రువుడు బాలుడగా నుండగనే వినాశము లేని స్థానమును గోరి అడవిలో మూడు వేల దివ్యసంవత్సరములు తపస్సును చేసెను(9). సర్వసమర్థుడు, లోకకర్త అగు బ్రహ్మ సంతసించినవాడై ఆయనకు తన స్థానముతో సమానమైనది, వినాశనము నేనిది అగు స్థానమును సప్తర్షులకు ఎదురుగా ఇచ్చెను(10).

తస్మాత్పుష్టిశ్చ ధాన్యశ్చ ధ్రువాత్పుత్రౌ వ్యజాయతామ్| పుష్టిరేవం సముత్థాయాః పంచ పుద్రాన కల్మషాన్||11

రిపుం రిపుంజయం విప్రం వృకలం వృషతేజసమ్| రిపోరేవం చ మహిషీ చాక్షుషం సర్వతో దిశమ్||12

అజీజనత్పుష్కరిణ్యాం వరుణం చాక్షుషో మనుః| మనోరజాయంత దశ నడ్వలాయాం మహౌజసః||13

కన్యాయాంహి మునిశ్రేష్ఠ వైశ్యజన్మ ప్రజాపతేః| పురుర్మాసశ్శతద్యుమ్నస్తపస్వీ సత్యవిత్కవిః|| 14

అగ్నిష్టోమో%తిరా త్రిశ్చాతిమన్యుస్సుయశా దశ| పురోరజనయత్పుత్రాన్ షడాగ్నేయీ మహాప్రభాన్||15

అంగం సమనసం ఖ్యాతిం సృతిమంగిరసం గయమ్| అంగాత్సునీతా భార్యా వైవేనమేకమసూయత||16

అపచారేణ వేనస్య కోపస్తేషాం మహానభూత్|| హుంకారేణైవ తం జఘ్నుర్మునయో ధర్మతత్పరాః||17

అథ ప్రజార్థమృషయఃప్రార్థితాశ్చ సునీథయా| సారస్వతాస్తదా తస్య మమంథుర్దక్షిణం కరమ్||18

వేనస్య పాణౌ మథితే సంబభూవ తతః పృథుః| స ధన్వీ కవచీ జాతస్తేజసాదిత్యసన్నిభః||19

అవతరారస్సవిష్ణోర్హి ప్రజాపాలనహేతవే| ధర్మసంరక్షణార్థాయ దుష్టానాం దండహేతవే||20

ఆ ధ్రువునకు పుష్టి, ధాన్యుడు అనే పుత్రుడు కలిగిరి. పుష్టికి సముత్థ అను భార్య గలదు. ఆమె అయిదుగురు పవిత్రులగు పుత్రులను కనెను (11). రిపుడు, రిపుంజయుడు, విప్రుడు, వృకలుడు మరియు వృషతేజసుడు అనునవి వారి పేర్లు. రిపుని భార్య సర్వదిక్కులకు ప్రభువు అగుచాక్షుషమనువును పుత్రునిగా పొందెను (12). చాక్షుషమనువునకు పుష్కరిణి అను భార్యయందు వరుణుడు పుట్టెను. ఆ మనువునకు నడ్వల అను భార్యయందు గొప్ప తేజశ్శాలురగు పదిమంది పుత్రులు కలిగిరి (13). ఓ మహర్షీ! నడ్వల వైశ్యకులములో జన్మించని ప్రజాపతి (లేదా

వైశ్యజన్మ(ప్రజాపతి) యొక్క కుమార్తె. పురువు, మానుడు, శతద్యుమ్నుడు, తపస్వి, సత్యవిత్, కవి (14), అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, అతిమన్యుడు, సుయశస్సు అనునవి ఆ పదిమంది పేర్లు. పురువునకు ఆగ్నేయియందు గొప్ప తేజస్సు గల ఆర్గురు పుత్రులు కలిగిరి (15). అంగుడు, సుమనుడు, ఖ్యాతి, సృతి, అంగిరసుడు, గయుడు అనునవి వారి పేర్లు. అంగునకు సునీథ అనే భార్యయందు వేనుడు అనే ఒక పుత్రుడు కలిగెను (16). వేనుడు చేసిన అపరాధముచే ధర్మనిష్ఠులగు మునులు గొప్ప కోపమును పొందినవారై హుంకారముచే ఆతనిని సంహరించిరి (17). తరువాత సునీథ సారస్వతమహర్షులను సంతానము కొరకు ప్రార్థించగా, అపుడు వారు వేనుని కుడి చేతిని మథించిరి (18). వేనుని చేతిని మథించగా దానినుండి ధనస్సును కవచమును ధరించి తేజస్సులో సూర్యుని పోలియున్న పృథువు పుట్టెను (19). విష్ణువు ధర్మమును సంరక్షించి దుష్టులను శిక్షించి ప్రజలను పాలించుట కొరకై ఆ విధముగా అవతరించెను. (20).

పృథుర్వైన్యస్తదా పృథ్వీమరక్షత్ క్షత్రపూర్వజః |
రాజసూయాఇషిక్తానామాద్యస్స వసుంధాపతిః || 21

తస్మాచ్చైవ సముత్పన్నౌ నిపుణౌ సూతమా గధౌ | తేనేయం
గౌర్మునిశ్రేష్ఠ దుగ్ధా సర్వహితాయవై || 22

సర్వేషాం వృత్తిదశ్చాఉర్ధ్వవర్షిసురరక్షసామ్ | మనుష్యాణాం
విశేషేణ శతయజ్ఞకరో నృపః || 23

పృథోః పుత్రౌ తు జజ్ఞాతే ధర్మజ్ఞౌ భువి పార్థివౌ | విజితాశ్వశ్చ
హర్యక్షో మహావీరౌ సువిశ్రుతౌ || 24

శిఖండినీ చాజనయత్పుత్రం ప్రాచీనబర్హిషమ్ | ప్రాచీనాగ్రాః
కుశాస్తస్య పృథివీతలచారిణః || 25

సముద్రతనయా తేన ధర్మతస్సువివాహితా | రేజే%ధికతరం రాజా
కృతదారో మహాప్రభుః || 26

సముద్రతనయాయాస్తు దశ ప్రాచీనబర్హిషః | బభూవుస్తనయా దివ్యా బహుయజ్ఞకరస్య వై || 27

సర్వే ప్రాచేతసా నామ్నా ధనుర్వేదస్య పారగాః |
అపృథగ్ధర్మాచరణాస్తే%తప్యంత మహత్తపః || 28

దశవర్షసహస్రాణి సముద్రసలిలేశయాః | రుద్రగీతం జపంతశ్చ శివధ్యానపరాయణాః || 29

తపశ్చరత్సు పృథివ్యామభవంశ్చ మహీరుహాః | అరక్ష్యమాణాయాం పృథ్వ్యాం బభూవాథ ప్రజాక్షయః || 30

తాన్ దృష్ట్వా తు నివృత్తాస్తే తపసో లబ్ధసద్వరాః |
చుక్రుధుర్మునిశార్దూల దగ్ధుకామాస్తపోబలాః || 31

ప్రాచేతసా ముఖ్యేభ్యస్తే ప్రాసృజన్నగ్నిమారుతౌ | వృక్షానున్మూల్య వాయుస్తానదహద్ధవ్యవాహనః || 32

వృక్షక్షయం తతో దృష్ట్వా కించిచ్ఛేషేషు శాఖిషు |
ఉపాగమ్యాబ్రవీదేతాన్ రాజా సోమః ప్రతాపవాన్ || 33

వేనుని కుమారుడు, క్షత్రియులకు మూలపురుషుడు, రాజసూయయాగములో అభిషిక్తులైన మహారాజులలో మొదటివాడు అగు ఆ పృథుమహారాజు అపుడు భూమిని రక్షించెను (21). సమర్థులగు సూతమాగధులు ఆయన పుత్రులే. ఓ మహర్షీ! ఆయన సర్వప్రాణుల హితమును గోరి గోరూపములోనున్న ఈ భూమిని పితికినాడు (22). వంద యజ్ఞములను చేసిన ఆ రాజు దేవర్షులకు, దేవతలకు, రాక్షసులకు, విశేషించి మానవులకు వృత్తిని కల్పించెను (23). పృథువునకు విజితాశ్వుడు, హర్యక్షుడు అనే ఇద్దరు మహావీరులు, గొప్ప కీర్తి గలవారు, ధర్మవేత్తలు అగు పుత్రులు ఉదయించి భూమిని పాలించిరి (24). శిఖండిని అనునామె ప్రాచీనబర్హిషుడు అనే పుత్రునకు జన్మనిచ్చెను. ఆయన భూమియందు సంచరించుచుండగా దర్భల కొనలు తూర్పు వైపునకు ఉండెడివి (25). ఆయన సముద్రుని కుమార్తెను యథాశాస్త్రముగా వివాహమాడెను. గొప్ప సమర్థుడగు ఆ రాజు

భార్యతో గూడి మిక్కుటముగా ప్రకాశించెను. (26).
అనేకయజ్ఞములను చేసిన ప్రాచీనబర్హిషునకు ఆ సముద్రుని కుమార్తె యందు పదిమంది తేజశ్శాలురగు పుత్రులు కలిగిరి (27). వారందరికీ ప్రాచేతసులు అని పేరు. ధనుర్వేదమునందు సిద్ధహస్తులగు ఆ ప్రాచేతసులు కలిసి ధర్మమును ఆచరిస్తూ గొప్ప తపస్సును చేసిరి (28). వారు సముద్రజలములలో నివసిస్తూ రుద్రగీతమును జపిస్తూ నిరంతరముగా శివుని ధ్యానించిరి (29). వారు తపస్సును చేయుచుండగా భూమిపై చెట్లు మొలిచినవి. భూమికి రక్షణ లేకపోవుటచే ప్రజానాశము సంభవించెను (30). ఓ మహర్షీ! గొప్ప వరములను పొంది తపస్సునుండి మరలి వచ్చిన ఆ రాజపుత్రులు చెట్లను చూచి కోపించి తపోలముచే వాటిని దహించ నిశ్చయించిరి (31). ఆ ప్రాచేతసులు తమ నోళ్ల నుండి అగ్నిని, వాయువును సృష్టించిరి. వాయువు చెట్లను పెకిలించి వేయగా, అగ్ని వాటిని దహించెను (32). ఈ విధముగా చెట్లు నాశనమై కొద్ది చెట్లు మాత్రమే మిగిలి యుండుటను గాంచి చెట్టుచేమలకు రాజు, ప్రతాపము గలవాడు అగు చంద్రుడు వారిని సమీపించి ఇట్లనెను. (33).

సోమ ఉవాచ |

కోపం యచ్ఛత రాజానస్సర్వే ప్రాచీనబర్హిషః |
అనుభూతానుకన్యేయం వృక్షాణాం వరవర్ణినీ || 34

భవిష్యం జానతా సా తు ధృతా గర్భేణ వై మయా | భార్యా వో%స్తు మహాభాగాసోమవంశవివర్ధినీ || 35

అస్యాముత్పత్స్యతే విద్వాన్ దక్షో నామ ప్రజాపతిః | సృష్టికర్తా మహాతేజా బ్రహ్మపుత్రః పురాతనః || 36

యుష్మాకం తేజసార్ధేన మమ చానేన తేజసా | బ్రహ్మతేజోమయో భూపః ప్రజా స్సంవర్ధయిష్యతి || 37

తతస్సోమస్య వచనాజ్జగృహుస్తే ప్రచేతసః | భార్యాం ధర్మేణ తాం ప్రీత్యాం వృక్షజాం వరవర్ణినీమ్ || 38

తేభ్యస్తస్యాస్తు సంజజ్ఞే దక్షో నామ ప్రజాపతిః | సోऽపి జజ్ఞే
మహాతేజాస్సోమస్యాంశేన వై మునే || 39

అచరాంశ్చ చరాంశ్చైవ ద్విపదోऽథ చతుష్పదః | సంసృజ్య
మనసా దక్షో మైథునీం సృష్టిమారభత్ || 40

వీరణస్య సుతాం నామ్నా వీరణీం స ప్రజాపతిః | ఉపయేమే
సువిధినా సుధర్మేణ పతివ్రతామ్ || 41

హర్యశ్వానయుతం తస్యాం సుతాన్ పుణ్యానజీజనత్ | తే విరక్తా
బభూవుశ్చ నారదస్యోపదేశతః || 42

తచ్ఛ్రుత్వా స పునర్దక్షస్సబలాశ్వానజీజనత్ |
నామతస్తనయాంస్తస్యాం సహస్రపరిసంఖ్యయా || 43

తేऽపి భ్రాతృపథా యాతాస్తన్మునేరుపదేశతః | నాగమన్
పితృసాన్నిధ్యం విరక్తా భిక్షుమార్గిణః || 44

సోముడు ఇట్లు పలికెను -

ప్రాచీన బర్హిషుని పుత్రులగు ఓ మహారాజులారా ! మీరందరు కోపమును విడిచిపెట్టుడు, ఈ సుందరి వృక్షముల కుమార్తె. ఈమె పేరు అనుభూత (?) (34). భవిష్యత్తు తెలిసిన నేను ఈమెను భద్రముగా రక్షించితిని. ఓ మహాత్ములారా! ఈమె మీకు భార్యయై సోమవంశమును వర్ధిల్లజేయు గాక ! (35) విద్వాంసుడు, సృష్టికర్త, గొప్ప తేజశ్శాలి, బ్రహ్మపుత్రుడు మరియు ప్రాచీనుడు అగు దక్షప్రజాపతి ఈమెయందు జన్మించగలడు (36). మీ తేజస్సుల సగమును, నా ఈ తేజస్సును మరియు బ్రహ్మయొక్క తేజస్సును పొందినవాడై ఈ రాజు ప్రజలను వృద్ధిలోనికి తేగలడు (37). తరువాత సోముని వచనముచే ఆ ప్రచేతసులు వృక్షముల కుమార్తెయగు ఆ సుందరిని యథావిధిగా ప్రమేతో వివాహమాడిరి (38). వారికి ఆమెయందు దక్షప్రజాపతి పుట్టెను. ఓ మునీ! గొప్ప తేజశ్శాలియగు ఆ శిశువు సోముని అంశ##చే జన్మించెను (39). దక్షుడు మనస్సుచే కదలని ప్రాణులను, కదిలే ప్రాణులను, రెండు పాదముల గల ప్రాణులను, నాలుగు పాదముల ప్రాణులను

సృష్టించి, తరువాత మైథునసృష్టిని ఆరంభించెను (40). ఆ ప్రజాపతి వీరణుని కుమార్తె మరియు పతివ్రత అగు వీరణిని యథావిధిగా చక్కని ధర్మముననుసరించి వివాహమాడెను (41). ఆయనకు ఆమెయందు పదివేలమంది హర్యశ్వులనే పుణ్యాత్ములైన కుమారులు కలిగిరి. వారు నారదుని ఉపదేశము వలన విరక్తులైరి (42). ఆ విషయమును విని దక్షుడు మరల ఆమెయందు సుబలాశ్వులనడే వేయిమంది కుమారులను గనెను (43). వారు కూడ ఆ నారదమునియొక్క ఉపదేశముచే సోదరులు వెళ్లిన దారియందే పయనించి విరక్తులై భిక్షాటనముతో జీవించిరి. వారు తిరిగి తండ్రి వద్దకు రాలేదు (44).

తచ్ఛ్రుత్వా శాపమాక్రుద్ధో మునయే దుస్సహం దదౌ | కుత్రచిన్న లభ##స్వేతి సంస్థితిం కలహప్రియ || 45

సాంత్వితోఽథ విధాత్రా హి స పశ్చాదసృజత్ స్త్రియః | మహాజ్వాలాస్వరూపేణ గుణైశ్చాపి మునీశ్వర || 46

దదౌ స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ | ద్వే చైవం బ్రహ్మపుత్రాయ ద్వే చైవాంగిరసే తదా || 47

ద్వే కృశాశ్వాయ విదుషే మునయే మునిసత్తమ | శిష్టాస్సోమాయ దక్షోఽపి నక్షత్రాఖ్యా దదౌ ప్రభుః || 48

తాభ్యో దక్షస్య పుత్రీభ్యో జాతా దేవాసురాదయః | బహవస్తనయాః ఖ్యాతాసై#ుస్సర్వైః పూరితం జగత్ || 49

తతః ప్రభృతి విప్రేంద్ర ప్రజా మైథునసంభవాః | సంకల్పాద్దర్శనాత్ స్పర్శాత్పూర్వేషాం సృష్టిరుచ్యతే || 50

ఆ విషయమును విని ఆయన కోపించి 'ఓరీ కలహప్రియా ! నీకు ఎక్కడైనైననూ స్థిరముగా నుండే అవకాశము లభించ కుండుగాక!' అని నారదునకు సహింప శక్యము గాని శాపమునిచ్చెను (45). ఓ మహర్షీ! అపుడు ఆయనను బ్రహ్మ ఓదార్చెను. తరువాత దక్షుడు గుణవతులు, గొప్ప అగ్నిజ్వాలల రూపములో నున్నవారు అగు కుమార్తెలను కనెను (46). ఓ మహర్షీ! సమర్థుడగు ఆ దక్షుడు

పదిమందిని ధర్మునకు, పదముగ్గురిని కశ్యపునకు, ఇద్దరిని బ్రహ్మపుత్రునకు, ఇద్దరిని అంగిరసునకు, ఇద్దరిని విద్వాంసుడు మహర్షి అగు కృశాశ్వునకు, మిగిలిన నక్షత్రములు అనదే అమ్మాయిలను సోమునకు ఇచ్చి వివాహములను చేసెను (47, 48). ఆ దక్షుని కుమార్తెలకు దేవతలు, రాక్షసులు మొదలగు అనేకులగు విఖ్యాతులైన పుత్రులు కలిగిరి. జగత్తు వారందరిచే నిండి పోయెను (49). ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! అప్పటినుండియు ప్రజలయొక్క మైథునసృష్టి ఆరంభమాయెను. అంతకు పూర్వములో సంకల్పము వలన, దర్శనము వలన, మరియు స్పర్శ వలన సంతానము కలిగెడిది (50).

శౌనక ఉవాచ |

అంగుష్ఠాద్ర్బహ్మణో జజ్ఞే దక్షశ్చోక్తస్త్వయా పురా | కథం ప్రాచేతసత్వం హి పునర్లేభే మహాతపాః || 51

ఏతం మే సంశయం సూత ప్రత్యాఖ్యాతు త్వమర్హసి | చిత్రమేతత్స సోమస్య కథం శ్వశురతాం గతః || 52

శౌనకుడు ఇట్లు పలికెను -

దక్షుడు బ్రహ్మయొక్క బొటనవ్రేలినుండి పుట్టినాడని నీవు పూర్వము చెప్పియుంటివి. మహాతపశ్శాలియగు ఆ దక్షుడు మరల ఏ విధముగా ప్రచేతసుని కుమారుడు ఆయెను? (51) ఓ సూతా! నా ఈ సందేహమును నీవు తీర్చదగుదువు. ఇది చిత్రముగా నున్నది. అతడు సోమునికి మామగారు ఎట్లు అయినాడు? (52)

సూత ఉవాచ |

ఉత్పత్తిశ్చ నిరోధశ్చ నిత్యం భూతేషు వర్తతే | కల్పే కల్పే భవంత్యేతే సర్వే దక్షాదయో మునే || 53

ఇమాం విసృష్టిం దక్షస్య యో విద్యాత్సచరాచరమ్ | ప్రజావానాయుషా పూర్ణస్స్వర్గలోకే మహీయతే || 54

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం సృష్టివర్ణనం నామత్రింశో%ధ్యాయః (30).

సూతుడు ఇట్లు పలికెను -

ప్రాణులలో సృష్టిప్రళయములు నిత్యము జరుగుచుండును. ఓ మునీ! ఈ దక్షుడు మొదలగు వారు అందరు ప్రతి కల్పమునందు ఉండెదరు (53). ఈ స్థావరజంగమములగు ప్రాణులతో కూడియున్న దక్షుని విశేషసృష్టిని తెలుసుకొను వ్యక్తి సంతానమును, పూర్ణమగు ఆయుర్దాయమును పొంది స్వర్గలోకమునందు మహిమను గాంచును (54).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు సృష్టివర్ణనమనే ముప్పదియవ అధ్యాయము ముగిసినది (30).